# అంకితం



10 జూన్ 1964 1 ఫిబ్రవరి 2025

**శ్రీమతి సూర్యదేవర రాజ్యలక్ష్మి**

ఉత్తమ ఉపాధ్యాయని

అధ్యక్షురాలు: సావిత్రిబాయి పూలే సామాజిక వేదిక



**లోకంలో**

**నీవు పడిన బాధలు ఎవరూ పడలేదమ్మా!**

**బాధలనే బాధ్యతగా ఉద్యమాలు చేసిన స్ఫూర్తి**

**నీచరిత్రగ నిలిచేనమ్మా!**



# మైత్రేయ బౌద్ధ విహార
ఒక సంక్షిప్త పరిచయం

ఎం. కె. గౌరవ్
పి. ఎస్. రవికాంత్

అడుగుజాడ ప్రచురణలు
రాజమహేంద్రవరం

ఏప్రిల్ 13, 2025
మానవతామూర్తి విగ్రహావిష్కరణ
శుభసందర్భం



మూల్యం : అమూల్యం

**వెనుకపేజీలో**
**తననే తాను మలుచుకొంటున్న మానవుడు : మహోదయ**

---

**ప్రాప్తి స్థానం**
**యార్లగడ్డ జగదీశ్వరరావు,**
**(మహోదయ యాజర)**
**మైత్రేయ బౌద్ధ విహార, వేమగిరి, తూ.గో.జిల్లా**
**వివరాలకు : సెల్ : 9441265845**

# వే (ప్రే)మారామం

వేమగిరి కొండమీద రెండు దశాబ్దాల కృషికి నిలువెత్తు రూపం మైత్రేయి బుద్ధాశ్రమం(వేమారామం). యార్లగడ్డ జగదీశ్వర్రావు @ యాజరా @ మహోదయ తెలుగు నేల మీద ఏక వ్యక్తి సైన్యంగా చేస్తున్న సాంస్కృతికోద్యమానికి తిరుగులేని కేంద్రం అది. అక్షరాలా ఎనభై నాలుగడుగుల నడుస్తున్న బుద్ధుని నిలువెత్తు విగ్రహం, నిర్మాణంలో ఉన్న భారీ అశోకచక్రం, ధ్యాన మందిరం, అంబేద్కర్, గాంధీ, వివేకానంద, ఫూలే, సావిత్రి బాయ్ ఫూలే, గురజాడ, శ్రీక్రిష్ణదేవరాయలు, భగత్సింగ్ ఇలా మహనీయుల విగ్రహాల్నే కాకుండా వారి ఆదర్శాల్ని కూడా ఆచరించడానికి చేసిన ఒక ప్రయత్నం ఈ ఆశ్రమం. కొండపల్లి సీతారామయ్య వంటి నక్సలైట్ ల నుండి వావిలాల గోపాలకృష్ణయ్య వంటి గాంధేయవాదుల వరకూ అనేకమందితో అనుభవాలు పంచుకున్న మహోదయ కుల,మత, రాజకీయ పార్టీ లకి, సిద్ధాంతాలకి అతీతంగా మానవతే మార్గంగా మానవీయ, సామాజిక బాధ్యత తో, ప్రకృతి తో మైత్రీ, కరుణా, సహానుభూతులే లక్ష్యం గా మంచి మానవ సమాజం కోసం పడ్డ తాపత్రయం కొద్దిగా చాదస్తమనిపించినా వినకుండా ఉండలేం. అద్భుతమైన కడియం పూదోటలూ, నర్సరీలు, ధవళేశ్వరం బ్యారేజి ఇంకా చుట్టూ విస్తరించిన మనోహరమైన ప్రకృతి అందాల్ని ఆస్వాదిస్తూ, అభిమానంగా మనకెక్కడ అసౌకర్యం కలుగుతుందోనని తన శక్తి మేరకు ఆతిథ్యం ఇచ్చే మహోదయ ని ఒక్కసారి కలవడానికి ప్రయత్నించండి. చాలా రోజుల తర్వాత ఈరోజు మహోదయని కలిసాను. చాలా సేపు ఆత్మీయంగా పాత ఊసుల్ని గుర్తుచేసుకుంటూ గడిపాం. కాలాతీతంగా నాకెప్పుడూ ఆతిథ్యం ఇచ్చే ఆశ్రమం అది. అనేక సభలు, సమావేశాలు, వర్షాకాల సాయంత్రాలు, వేసవి రాత్రులు, శీతాకాలపు వెచ్చదనాలు, కాల్చుకుతిన్న తియ్యటి తాటికాయలు,పంచుకున్న పుల్లటి చింతచిగురు , ఇంకా గోదావరి రుచులు ఇలా ఎన్ని జ్ఞాపకాల్నని పంచుకోను?....అక్రమ కేసులు బనాయించి నన్ను వేధించిన రోజుల్లో అర్ధరాత్రి, అపరాత్రని లేకుండా ఆదరించిన ఆ ప్రేమ సౌధానికి ప్రేమతో...

## మహాసంకల్పానికి మరోరూపం

# మైత్రేయ బౌద్ధ విహార

*Philosophy today is the responsibility of man as Man. In opposition to supposedly total knowledge, philosophy is charged with the duty of keeping awake the faculty of independent thought and therewith the independence of the individual which totalitarian powers seek to extinguish. Philosophy must remind every individual that he can be himself, and that he ceases to be a man if he relinquishes this privilege.*

***- Kael Jaspers, Basel,*** *Philosopher*

భారతీయ తాత్విక చరిత్రకు ఆత్మ బౌద్ధం. భావవాద, భౌతికవాద ప్రవంతులకు అతీతమైన కార్యోన్ముఖ కరదీపిక బౌద్ధం. బౌద్ధం ఈ నేలని తాకిన క్షణమే భారత భూమికి నూతన జ్ఞానోదయం. అది అవిచ్ఛిన్నమైన అంతరంగ పరంపర. అఖండమైన సామూహిక సంవాదనా ప్రవాహం. నిత్యం కొనసాగే అనేక రకాల క్లిష్టమైన సంక్షోభాలకు సమాధానంగా నిరంతర మానవీయ సౌందర్యంతో మధించిన ఒక అత్యుత్తమ మార్గమే బౌద్ధం. సంఘర్షణాత్మక మానవుడి సమస్యాత్మక మనసుకు సమన్వయ దిక్సూచి బౌద్ధం. భారతీయ తాత్విక చింతన లోని జ్ఞాన సంపదనీ, శ్రమనక సాంప్రదాయ భావనని మిళితం చేసిన అరుదైన అన్వేషణా విధానం బౌద్ధం. అందుకనే లోకంలోని ప్రతీ చోటుకి ప్రవేశించింది. మైకంలో ఉన్న ప్రతీ వ్యవస్థనీ మేల్కొల్పింది. శోకాన్ని అధిగమించడమే పురోగమనమని నిర్దేశించింది. బౌద్ధం మానవాళి ఉన్నతికి జీవగర్ర.

అలాంటి మహోన్నతమైన బౌద్ధాన్ని తనవంతు ప్రచారం చేయడానికి గానూ, ఏక వ్యక్తి సైన్యంగా యార్లగడ్డ జగదీశ్వరరావు @ యాజర @ మహోదయ తెలుగు నేల మీద చేస్తున్న మహత్తరమైన మానవోద్యమానికి వేమగిరి మైత్రేయ బుద్ధ విహార విశిష్టమైన ప్రతీక. పదుల సంఖ్యలో ప్రజాపక్ష బుద్ధిజీవుల విగ్రహాలతో ఎటు చూసినా పచ్చగా అలరాడే చెట్లు, పక్షుల కిలకిలా రావాలతో ప్రకృతి ఒడిలో తులతూగే ప్రశాంత వాతావరణం ఆశ్రమం సొంతం. ఇంకా ఆశ్చర్యకర మైన విశేషం ఏంటంటే స్వయంగా శ్రమజీవైన మహోదయ ఆయన విగ్రహాన్ని కూడా ఏర్పాటు చేసుకోవడం. నిరంతరం తెలుగు రాష్ట్రాల్లో ఏదో ప్రాంతం నుండి ఎందరో జిజ్ఞాసువులు నిత్యం సందర్శించి, సద్గోష్టులకు తెరదీయడం ఇక్కడ ఎప్పుడూ చూస్తుంటాం. దశాబ్దానికి పైగా విశాలమైన ఈ సౌధంతో ఉన్న నా అనుబంధానికి గుర్తుగా అప్పుడప్పుడు వెలిబుచ్చిన అక్షర రూపాలివి.

జీవితంలో ఏదో కొంత మంచి చేయాలనే తపన అందరికీ ఉంటుంది. కానీ, ఒక మహాసంకల్పం కోసం జీవితాన్ని అంకితం చేయడం కొందరికే సాధ్యం. ఎన్ని విమర్శలు వచ్చినా, ఇంకెన్ని ఆటుపోట్లు రానున్నా సరే వాళ్లనుకున్నదే చేస్తారు. అందుకున్న బాటలోనే నడుస్తారు. ఒక మెరుగైన సమాజాన్ని స్థాపించడం కోసమే తపిస్తారు. గోడలు లేని విశ్వనరులుగానే జీవిస్తారు. వాళ్ల వ్యక్తిత్వంలోని లోపాల న్నిటినీ వారెన్నుకున్న పద్ధతి పటాపంచలు చేస్తుంది. వారి సిద్ధాంత చైతన్యంలోని వాదాలన్నింటినీ వారేగిన పయనం మెరుగుపరుస్తుంది. ఎన్ని కబుర్లు చెప్పండి, ఒక్క ఆచరణాత్మకమైన కార్యాచరణకు అవేవీ సాటిరావు. ఎన్ని చర్చలు చెయ్యండి చిటికెడు క్రియా శీలతను చేర్చందే వేటికీ వాటిదైన విలువలేదు. ఈ దేశంలో మనుషుల సౌశీల్యానికి ఉద్దేశించినవే శ్రమణక మతాలు, భక్తి ఉద్యమాలు, ఉపనిషత్తులు.

వాటన్నింటినీ ఒకే గాటిన కట్టి చులకన చేసే ప్రయత్నం భావోద్యమాల ప్రధాన లోపం. వందల వేల ఏళ్లపాటు జరిగిన ఆధ్యాత్మికత అంతా మూఢత్వం కాదు. అందులో ఆధిపత్యం ఒక భాగం. అసమానత్వం మరో భాగం. వాటిని

కచ్చితంగా వ్యతిరేకించాల్సిందే. కానీ, ఆ క్రమంలో ఈ దేశంలో జరిగిన అవిశ్రాంత ఆలోచనాత్మకమైన కృషిని తక్కువ చేయడం తగదు. అలా ఉన్న వాటిల్లో మంచిని చూసి స్వీకరించే హంస వంటి లక్షణం బౌద్ధానిది. నిజానికి ఈ రకమైన సంస్కరణావాదం కోసం ప్రతీ మతంలోనూ ప్రత్యేకంగా ప్రయత్నాలు చేసిన వారు ఉన్నారు. దురదృష్టవశాత్తూ వారి ఆలోచనల్ని అందుకునే పని తరవాతి తరాలు చెయ్యలేదు. మైత్రేయ బౌద్ధ ఆశ్రమంలో ఆ పనిఏదో మేరకు జరుగుతోంది. అందులో భాగంగానే వ్యక్తుల రూపాల్ని, సారాన్ని కూడా ఇక్కడ ఉంచిచర్చించడం, ఆయా వ్యక్తుల ఆశయాల సాధన లో భాగస్వాములవడం జరుగుతుంది.

నిజానికి మైత్రేయ బౌద్ధ ఆశ్రమం తరపునుండి గతంలో కూడా పలు ప్రచురణలు వొచ్చి ఉన్నాయి. మహోదయ రచనల సంపుటి “నన్ను నేను ప్రకటించుకున్నా బొర్రాగోవర్ధన్ రచన “శాకాహారమా? మాంసాహారమా??” మానవతా మార్గం : “బౌద్ధం” వంటి రచనలు ప్రచురించారు. ఇవేగాక ఎన్నో పత్రికలకు, వర్ధమాన రచయితలకూ సహకరిస్తున్నారు. మద్యపాన వ్యతిరేక ఉద్యమం మొదలు కుని తెలుగు భాష పరిరక్షణ ఉద్యమం వరకూ ఎన్నింటి లోనో ఆశ్రమం ఒక భాగం. మహోదయ యాజర చేసిన మరెన్నో రచనలు కాలగర్భంలో కలిసి పోయాయి. ఆశ్రమంతోనూ, ఆయనతోనూ ఉన్న అభిమానంతో  వివిధ సందర్భాల్లో సామాజిక మాధ్యమాల్లో రాసిన వాటిని హడావిడిగా ఇలా ఒక్కదరికి చేర్చడం జరిగింది. పునఃశ్చరణ దోషాలు, సమన్వయ లోపాలు ఉండవచ్చు కాన వాటికి పూర్తి బాధ్యత మాదే.

మరో మనిషి మంచిని కోరే మహోదయ మరింత ఉత్సాహంగా ఆయురా రోగ్యాలతో ఉండాలనేది మా కోరిక. ఆయన ఆలోచనల్లో కూడా సమ భాగస్వామి అయిన కీ. శే. రాజ్యలక్ష్మి గారి హఠాత్మరణం ఆయనకి నిజంగా తీరని లోటే. అయినప్పటికీ ఆమెకి కేటాయించాల్సిన ఆ సమయాన్ని కూడా సమాజం కోసమే తాను కేటాయిస్తానని నిర్ణయించుకోవడం మహోదయ వజ్ర

సంకల్పానికి చిహ్నం. వేమగిరి ఆశ్రమంతో పాటు కొడవలి, కోరుకొండ తదితర ప్రాంతాల్లో కూడా బౌద్ధ సంస్కృతిని వికసింప జేయాలనేదే ఆయన నిరంతర తపన. మా ప్రాంతానికి వొచ్చే మిత్రులు అనేకమందిని ఆశ్రమానికి తీసుకెళ్లి పరిచయం చేయడం నాకో సంతృప్తి. ఇంకా ఎంతో చేయాలనే ఆశ ఉన్నప్పటికీ కొత్తగా వొచ్చిన వివిధ పరిమితుల మధ్య ఉన్న సమయాన్ని కుదించుకోవాల్సి వస్తోంది. అయినప్పటికీ తరచుగా ఫోన్లో మాట్లాడు కోవడం చర్చించుకోవడం మహోదయకూ, మాకూ ఇన్నేళ్లలో అలవాటైన విషయం. ఇప్పుడు 84 అడుగుల బుద్ధ విగ్రహం ఆవిష్కరణ కార్యక్రమం సందర్భంగా తీసుకొస్తున్న ఈ చిన్న పుస్తకం ఆశ్రమంలాగే మహోదయ యాజరా మహాసంకల్పానికి చిన్నపాటి రూపం మాత్రమే. సెలవు.

**ఏం. కె. గౌరవ్**

**పి. ఎస్. రవికాంత్**



అశోకుని విగ్రహం



భారీ అశోక చక్రం

## బహుజన హితం: మహోదయ అభిమతం

# ప్రేమాధామం : వేమారామం!

*I see his greatness not in speaking,*
*not in thinking, but only in doing, in living*
*Hermann Hesse (Siddhartha)*

వేమగిరి కొండమీద రెండు దశాబ్దాల కృషికి నిలువెత్తు రూపం మైత్రేయి బుద్ధాశ్రమం (వేమారామం). యార్లగడ్డ జగదీశ్వర్రావు @ యాజరా @ మహోదయ తెలుగు నేల మీద ఏక వ్యక్తి సైన్యంగా చేస్తున్న సాంస్కృతికోద్యమానికి తిరుగులేని కేంద్రం అది.

Statue of Humanity పేరిట అక్షరాలా ఎనభై నాలుగడుగుల నడుస్తున్న బుద్ధుని నిలువెత్తు విగ్రహం, భారీ అశోకచక్రం, ధ్యాన మందిరం, అంబేద్కర్, గాంధీ, భగత్సింగ్, వివేకానంద, పూలే, సావిత్రి బాయ్ పూలే, గురజాడ, శ్రీక్రిష్ణ దేవరాయలు, మొదలైన మహనీయుల విగ్రహాల్నే కాకుండా వారి ఆదర్శాల్ని కూడా ఆచరించడానికి చేసిన ఒక ప్రయత్నం ఈ ఆశ్రమం.

కొండపల్లి సీతారామయ్య వంటి నక్సలైట్ల నుండి వావిలాల గోపాలకృష్ణయ్య వంటి గాంధేయవాదుల వరకూ అనేకమందితో అనుభవాలు పంచుకున్న మహోదయ కుల,మత, రాజకీయ పార్టీలకి, సిద్ధాంతాలకి అతీతంగా మానవతే మార్గంగా మానవీయ, సామాజిక బాధ్యత తో, ప్రకృతి తో మైత్రీ, కరుణా, సహానుభూతులే లక్ష్యంగా మంచి మానవ సమాజం కోసం పడ్డ తాపత్రయం కొద్దిగా చాదస్తమనిపించినా వినకుండా ఉండలేం.

అద్భుతమైన కడియం పూదోటలూ, నర్సరీలు, ధవళేశ్వరం బ్యారేజి ఇంకా

చుట్టూ విస్తరించిన మనోహరమైన ప్రకృతి అందాల్ని ఆస్వాదిస్తూ, అభిమానంగా మనకెక్కడ అసౌకర్యం కలుగుతుందోనని తన శక్తి మేరకు ఆతిథ్యం ఇచ్చే మహోదయ ని ఒక్కసారి కలవడానికి ప్రయత్నించండి.

కాలాతీతంగా నాకెప్పుడూ ఆతిథ్యం ఇచ్చే ఆశ్రమం అది. అనేక సభలు, సమావేశాలు, వర్షాకాల సాయంత్రాలు, వేసవి రాత్రులు, శీతాకాలపు వెచ్చదనాలు, కాల్చుకుతిన్న తాటికాయలు, పుల్లటి చింతచిగురు , ఇంకా గోదావరి రుచులు ఇలా ఎన్ని జ్ఞాపకాల్ని పంచుకోను?

అక్రమ కేసులు బనాయించి నన్ను వేధించిన రోజుల్లో అర్ధరాత్రి, అపరాత్రని లేకుండా ఆదరించిన ఆ ప్రేమ సౌధాన్ని ప్రేమతో ఇలా తల్చుకుంటూ, “Revolution in society must begin with revolution in your own thinking and acting” అంటారు జిడ్డు కృష్ణమూర్తి. మహోదయను చూస్తే నాకు ఆ మాటలే గుర్తొస్తాయ్. గతంలో శిథిలావస్థకు చేరిపోయి, మరికొన్నాళ్ళలో కాలానికి ఆహూతైపోనున్న ఆయన రచనల్ని ఒక్క దరికి చేర్చి “బహుజన బౌద్ధ సమాఖ్య” ఆద్వర్యంలో ప్రచురించడం జరిగింది.

చాలా కాలం క్రితం “ఏలూరు టైమ్స్” పత్రికలో దాదాపు ఏడాది పాటు డా.బాబాసాహెబ్ అంబేద్కర్ మీద సీరియల్ గా ఒక రచన మహోదయ చేసారు. మిత్రులెవరైనా పూనుకొని ఆ వివరాలు ఆయన్నడిగి ఆ రచన వెలికి తీసినట్లైన ఆయనకి ప్రచురించాలనే తలంపు ఉంది. ఆ దిశగా ఎవరైనా సాయం చేయగలరేమో చూడండి.

తెలుగుజాతి సాంస్కృతిక వికాస కేంద్రంగా విలసిల్లుతోన్న మైత్రేయి బుద్ధవిహార (వేమగిరి) రాజమహేంద్రవరానికి కూతవేటు దూరంలో తెలుగు జాతి సాంస్కృతిక వికాసానికి, తెలుగు భాష పరంపరాభివృద్ధికి అంకితం అయింది. 84 అడుగుల నిలువెత్తు నడయాడే తథాగతుని మూర్తితో దేశంలోనే అరుదైన ఆశ్రమంగా ప్రఖ్యాతి చెందింది.

తెలుగు భాషలోని అక్షరాల వర్ణమాలతో నిర్మించిన ‘తెలుగు పందిరి’,

ఇంకా శతాబ్దాల క్రితమే తెలుగునాట ఆలోచనా చైతన్యాన్ని రగిలించిన, మొట్టమొదటి తెలుగు ప్రజాకవి 'వేమన' దాదాపు 12 అడుగుల దేశంలోనే అతిపెద్ద విగ్రహం ఇక్కడ ప్రత్యేక ఆకర్షణ.

తెలుగువారి కీర్తిని వైజ్ఞానిక రంగంలో నలుదిశలా చాటిచెప్పిన ఎల్లాప్రగడ సుబ్బారావు మొదలుకొని ఎన్టీ రామారావు వరకూ, మహాకవి గురజాడ, కందుకూరి వీరేశలింగం నుండి కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య దాకా, ఎందరో మహానుభావులు తారసపడతారు.

వీనులవిందుతో శోభాయమాన ప్రకృతి దృశ్యాల మధ్య, విస్తరించిన పచ్చికబయళ్ళు, ప్రపంచ వ్యాప్తంగా అనేక భాషా పుస్తకాల తో తొణికిసలాడే విశాలమైన గ్రంథాలయం, ప్రశాంతమైన ధ్యాన మందిరం, వస్తూపోయే సందర్శకులతో కళకళలాడే మైత్రేయి బుద్ధ విహార, వేమగిరిలోని మసీద్‌లో రంజాన్ మాసం సందర్భంగా ముస్లిం సోదరులకు ఇఫ్తార్ విందు ఏర్పాటు చేయడం అరుదైన విషయం. నాకు తెల్సీ మొట్టమొదటి సారిగా మతసామరస్యం కోసం ఒక బౌద్ధ ఆశ్రమం అవలంబించిన గొప్ప సత్సాంప్రదాయం ఇది. మహోదయకు అభినందనలతో ఈ చిన్న రైటప్.





# భారతీయ సాంస్కృతిక వికాసంలో బౌద్ధం

## మైత్రేయి బుద్ధవిహార, వేమగిరి, రాజమండ్రి

తెలుగు రాష్ట్రాల్లో బహుశా మహాపండిత్  రాహుల్ సాంకృత్యాయన్ విగ్రహం ఉన్న ఏకైక ఆశ్రమం అదేనేమో. దేశంలోని వివిధ మహనీయుల విగ్రహాల్ని ఇంతటి స్థాయిలో ఏర్పాటు చేసింది ఈ చోటులో నేనేమో. కార్ల్ మార్క్స్ మొదలుకొని  యం. యన్. రాయ్ వరకూ, పుచ్చలపల్లి సుందరయ్య నుండి అశోకుడి దాకా చాదస్తం అనిపిస్తుంది కానీ ఆయా చారిత్రక వ్యక్తుల కృషిని చూస్తూ  కాదనగలమా?

అక్షరాలా 84 అడుగుల నిలువెత్తు బుద్దుడి విగ్రహం, దాని కిందే విశాలంగా పర్చుకుని ఉన్న గ్రంథాలయం, అంతెత్తునున్న అశోక చక్రం, ధ్యాన ప్రాంగణం, చుట్టూ పచ్చని చెట్ల మధ్యలో నుంచి ఆత్మీయంగా పలకరించే పక్షుల కువకువలు, అదిగాక విడిగా ఉండే ధ్యాన మందిరం, ఎప్పుడూ మట్టితో మమేకమై జీవించే యా.జ.రా.తో సంభాషణ, జీవం తొణికిసలాడుతూ ఉండే విగ్రహాల నడుమ కొద్దిమంది ఆత్మీయంగా కలిసి మాట్లాడు కోవడానికి మించినదేముందీ?



సౌకర్యాలు,వసతులూ ఏర్పాటు చేయడంలో లోపాలుండవచ్చు కానీ పాతికేళ్ళకి పైబడిన 'మహోదయ' ప్రయత్నాన్ని చూడటానికి, మంచిచెడులు మాట్లాడుతూ చర్చించడానికి ఎవరికీ భేషజాలు అవసరం లేదు. అయినా, తోచినట్లు పని చేసుకుపోతున్న శ్రామికుడికి చాతనైతే చేయందించాలి లేదా మౌనంగా వెళ్ళిపోవాలి కానీ, మన మేధావి తనాన్ని ప్రదర్శిస్తే ఎలా ?



బుద్ధుడికి జ్ఞానోదయం కదిలితే అయ్యింది కానీ కూర్చుంటే కాలేదు. సంచారంలో సంఘర్షిస్తేనే సమాధానాలు దొరికాయి కానీ సంసారిక జీవితంలో మునిగిపోతే దొరికేవి కావు. ప్రాపంచిక దృష్టి ధ్యానంగా భౌతిక ప్రపంచాన్ని అధ్యయనం చేస్తేనే అలవడు తుంది కానీ పరధ్యానంగా ఉంటే కాదు. అన్వేషణకి అర్థం పయనిస్తే లభిస్తుంది కానీ పూజిస్తే కాదు. అందుకే, రండి. ఆలోచనా పరులతో ఆచరణాత్మకంగా జరిగే అర్థవంతమైన బౌద్ధ సమాలోచనల్లో మనమూ భాగస్వాములౌదాం. వస్తారు కదూ?

# మానవతకు మారుపేరు మహోదయ యా.జ.రా.

అలాంటి చాదస్తపు మనిషి డిపార్ట్మెంట్లో అత్యంత అరుదని పోలీసు శాఖలో ఇప్పటికీ చెప్పుకుంటారు.

నీతి నిజాయితీలతో ఉద్యోగం చేసినన్నాళ్ళూ లంచం తీసుకోకుండా పనిచేసిన నిబద్ధతకు దక్కిన గౌరవమది.

ఇలాంటి వింత మనిషిని తామెక్కడా చూడలేదని ఆయనతో పరిచయమున్న వారంతా అంటుంటారు.

ప్రతీ పనినీ ఒళ్ళొంచి చేసుకునే స్వభావానికి ఆశ్చర్యపడి అభిమానంతో ఆయనకిచ్చే స్థానమది.

ఎలాంటి వారినయినా ముందు మనిషిగా గుర్తించాలనే ఆయన విధానాన్ని చాలామంది అర్థం చేసుకోలేరు.



మహాత్మా ఫూలే, మాతా సావిత్రి భాయి ఫూలే

అందుకే ఎవరికి వారు తమ సిద్ధాంత సులోచనాల్లోంచి ఆయన్ని చూస్తూ 'మావాడేనని' సరిపెట్టుకుంటారు.

హేతువాద ఉద్యమాలు మొదలుకుని భక్తి సంఘాల వరకూ అనేకులు ఆయన మిత్రులే.

కళాసాహిత్య సంస్కృతుల నుండీ సామాజిక రాజకీయ ఉద్యమాల దాకా వివిధ అంశాలాయనకు కరతలామలకాలే.

నాగభూషన్ పట్నాయిక్లాంటి నక్సలైట్లతో చర్చించడం దగ్గర్నుంచీ వావిలాల గోపాలకృష్ణయ్యగారి లాంటి గాంధేయవాదుల్ని వేమగిరిలోని తన ఆశ్రమానికి మోసుకురావడం దాకా ఎన్నెన్నో విలువైన అనుభవాల ఖజానా ఆయన.

శ్రీశ్రీ, దిగంబర విప్లవ కవులతో మొదలెట్టి గోరా, లవణాల దాకా అందరితో భుజం కలిపి తిరిగిన ఆయన అమూల్యమయిన జ్ఞాపకాల తుట్ట.

ఆస్తిక – నాస్తిక వైషమ్యాల పరిధిని దాటి మనుషుల బాధల్ని అర్థం చేసుకున్న నిజమయిన నవబౌద్ధుడు,

అగ్ర– నీచ కులాల అమానవీయ సంస్కృతిని తుదముట్టించడం కోసం నిత్యం అవిశ్రాంతంగా శ్రమిస్తున్న కృషీవలుడు,

పదిమందికి మంచి జరుగుతుందంటే ఎన్ని అవాంతరాలనైనా ఎదుర్కోవడానికి సిద్ధపడే విశ్వనరుడు,

మహోదయ యాజరా!

ఎప్పుడూ ఏదో పనిచేస్తూ పనిని మించిన ధ్యానం బౌద్ధంలో కూడా లేదని నిక్కచ్చిగా చెప్పే ఆయన్ని చూస్తే ఎవరికయినా కాస్త ఇబ్బందిగానే అనిపిస్తుంది. శ్రమని నీచంగా చూసే దుర్మార్గమయిన సంస్కృతిలో అంతకంటే ఔన్నత్యం మనకెలా అబ్బుతుంది?

అరవైకి పైబడ్డ వయసులో కూడా అవలీలగా తాటిచెట్లెక్కేస్తూ వద్దని

వారిస్తున్న వారివైపు జాలిగా చూసే ఆయన ఒక పట్టాన అర్థం కాడు. ముప్ఫయేళ్ళు నిండకుండానే నాగరిక సాధనాల ఊబిలో పడి ముసలివాళ్ళమైపోతున్న మనకెలా అర్థమౌతాడు?

స్వచ్ఛందంగా ఉద్యోగాన్ని వదిలేసి వచ్చిన దాన్ని నలుగురి మంచికీ ఉప యోగించాలన్న ఆయన్ని చూస్తే ఐనవాళ్ళూ, కానివాళ్ళూ చికాకు పడతారు. ఎవరెలా పోతే మాకేమనే లోకానికి నిస్వార్థతను బోధించే ఈయన పై మనసెవరు పడతారు?

దేశంలోనే విభిన్న మహనీయుల విగ్రహాలతో కూడిన అద్భుతమయిన ఆశ్రమాన్ని స్థాపించి ఉదయం లేచింది మొదలు ఒక్కడిగా ప్రపంచంలోని చెడంతటితోనూ ఒంటరిగా తలపడ్డానికి సిద్ధపడ్డట్లు ఎవరేమన్నా పట్టించుకోకుండా మౌనంగా పనిచేసుకుపోయే ఈయన భావమేమిటి?

లెక్కలేనన్ని చిక్కుముడులతో నిండిన జీవితంలో ఎన్నో ఒడిదుడుకుల్ని చవిచూసి, అలవికాని ఆటుపోట్లెన్నింటినో అధిగమించి చేసిన తప్పుల్ని సవినయంగా ఒప్పుకుంటూ, చేయాల్సిన మంచి పనుల చిట్టాను ఎప్పటికప్పుడు



సద్గోష్ఠి సంవాద స్థలం

పెంచుకుంటూ ఒక మహత్తరమైన లక్ష్యం కోసం జీవించే ఆయనలో మర్మమేమిటి?

ప్రశ్నలకి సమాధానాలు విని కాదు, స్వయంగా చూసి రాబట్టడమే శాస్త్రీయ పద్ధతి. సత్యమంటే అదే. ఎవరో చెప్పిన దానికి తలూపకుండా అది నిజమో కాదో ప్రయోగపూర్వకంగా తెల్సుకోవడం. తద్వారా వచ్చేదే జ్ఞానం. దానిని నైతికంగా క్రమబద్ధీకరించుకుని జీవించడమే ధర్మం. అదే బౌద్ధం.

కాబట్టి అతిశయోక్తులుగా అనిపించే ఈ నా రాతల అంతు తేల్చాలంటే మీ వంతు శోధనకి సిద్ధపడి వీలున్నప్పుడు వేమగిరి మైత్రేయాశ్రమానికి రండి. మనకెక్కడ అసౌకర్యం కలుగుతుందోనని శాయశక్తులా సంతృప్తిపరచడానికి ప్రయత్నించే ఈ చాదస్తపు మనిషిని చూడండి.

విరామం లేకుండా ఆయన నుంచి వెలువడే విషయాలన్నింటినీ వినడానికి ప్రయత్నించండి. విశ్రాంతి ఎక్కువ తీసుకుంటున్నానంటూ సిగ్గుపడుతూ ఇంకా భవిష్యత్తులో ఆయనేమి చేయబోతున్నాడో ఆ ప్రోగ్రామ్ అంతా విసుగనిపించేలా చెబుతూంటే ఓపిక తెచ్చుకుని వినండి.

అద్భుతమయిన కడియం తోటలు, ధవళేశ్వరం చారిత్రక కాటన్ బ్యారేజి, గోదావరి అందాలు అన్నింటికీ మించి గోదావరి రుచులు చూసి, తిరిగి రండని ఆహ్వానించే ఆయన ఆతిథ్యపు పరిమళాన్ని ఆస్వాదిస్తూ అప్పుడు ఒక్కసారి ఆలోచించండి, నేరాసిన ఇదంతా నిజమో కాదో!

నిజమే. చాలా విషయాల్లో ఆయన ఓడిపోయాడు. అనేక సందర్భాల్లో మోసపోయాడు. ఎన్నోసార్లు “నేను రచయితగా, చచ్చిపోయా”నంటూ పచ్చిగా విచారంతో ప్రకటించుకుంటుంటాడు. “చెయాల్సినవి చాలా ఉన్నాయంటూ బాధపడుతూ, “నావంతు సమాజాన్ని మార్చి తీరతా” నంటూ ఎప్పుడైనా ఆవేశపడుతుంటాడు.

సంవత్సరంలో ప్రతీరోజూ ఆరోజు ప్రాముఖ్యతను గుర్తించి కార్యక్రమాలు చేస్తుంటాడు. ఎంతోమంది ప్రముఖ వర్ధమాన రచయితలకూ, కళాకారులకూ, సాహితీవేత్తలకూ ఉద్యమకారులకూ తనవంతు సాయపడు

తుంటాడు. విభిన్న సంస్థలకు వెనకండగా నిలుస్తుంటాడు. ఇదాయన క్రమం. మామూలుగా మారని దైనందిన నియమం.

యువకునిగా యవ్వనోత్సాహంతో వ్యవస్థను మార్చడం కోసం తపించిపోయిన యా.జ.రా. మనకిక్కడ అక్షరాల్లో సాక్షాత్కరిస్తాడు. వాదాలన్నింటినీ నిర్ద్వందంగా పక్కనపెట్టి సాటి మనిషి పడే కష్టం పట్ల సానుభూతి చూపించే సహచరుడు ఆయన రచనల్లో కనిపిస్తాడు.

చేసిన అనేక విలువయిన తన రచనల్ని చెదపురుగులకి అంకితం చేసిన ఆయన్ని మనమెవ్వరం క్షమించలేకపోవడం సరైనదే అయినా అక్కడక్కడా మిగిలిన ఈ మాత్రపు అవశేషాలనైనా ఇంతకాలానికిలా మనకందజేస్తున్నందుకు మనస్ఫూర్తిగా మన్నించడం సబబు.

ఎన్నో పనుల్ని నెత్తినెత్తుకుని అన్నింటికీ న్యాయం చేయాలని ప్రయత్నించే ఆయన ఆశావహ దృక్పథం మనకి అతిశయోక్తిగా అనిపించవచ్చు కాని, అనేక సంవత్సరాలుగా విరామమిచ్చిన ఆయన తన రచనా వ్యాసంగాన్ని మళ్ళీ పునర్నిర్మించుకోవాలని కోరుకుంటూ, ప్రత్యామ్నాయ మానవీయ సంస్కృతిని నిర్మించే ప్రయత్నంలో భాగంగా తలపెట్టిన ఆయన కార్యాలన్నీ దిగ్విజయం కావాలని ఆకాంక్షిస్తూ ఇంతటితో ఆగుతాను.

ఆయన అభిప్రాయాలెన్నింటితోనైనా విభేదించొచ్చు, కానీ ఆచరణను అభినందించకుండా ఉండలేం.

ఆయన ఆలోచనల్లో ఎన్నో గందరగోళాలుండొచ్చు, అయినా ఆశయ సాధనకు జోహార్లర్పించకుండా ఉండలేం.

ఆయన అవగాహనలో కొన్ని లోపాలుండవచ్చు గాక, అంతిమంగా లక్ష్యానికి చేతులెత్తి నమస్కరించకుండా ఉండలేం.

*("నన్ను నేను ప్రకటించుకున్నా" మహోదయ యాజర*
*అసంపూర్ణ రచనల సంపుటికి రాసిన ముందుమాట)*



## మైత్రేయ బుద్ధవిహార స్థాపకులు
## మహోదయ (యా.జ.రా.) గారితో

# ఇంటర్వ్యూ

**ప్ర) మీ బౌద్ధధమ్మ ప్రస్థానం గురించి చెప్పండి?**

జ) నేను కృష్ణాజిల్లా పెడనం మండలం నందిగం అనే గ్రామంలో 1956, అక్టోబర్ 14న వ్యవసాయ కుటుంబంలో పుట్టాను. కూలీనాలీ చేస్తూ ఎస్సెస్సీ పూర్తి చేసాను. తర్వాత ఏలూరొచ్చి రేడియో యింజనీరింగ్ ట్రైనింగ్లో జాయినై దాని నిర్వాహకుల మోసంతో అది మూతపడ్డంతో కొన్నాళ్ళు వాచ్మెన్, టెలిఫోన్ డిపార్ట్ మెంట్లో పనిచేసి 19 ఏళ్ళకే కానిస్టేబుల్ ఉద్యోగాన్ని పొందా. అంతకుముందు నుంచే సుప్రసిద్ధ నాస్తికనేత గోరాగారితో నాకు పరిచయముండేది. పి. రజనీ గంగాధరనే (ఇప్పుడు ప్రముఖ రచయిత) మిత్రుడితో కల్సి 'ఉజ్వల' అనే రాత పత్రికను నడిపేవాడ్ని. హేతువాద, కులనిర్మూలనా, వామపక్ష సంఘాల కార్యక్రమాల్లో పాల్గొంటూ ఆ క్రమంలోనే బౌద్ధాభిమానిగా మారాను.



విశాలమైన గ్రంథాలయం

**ప్ర) ఆ కాలంలో మిమ్మల్ని ప్రభావితం చేసిన వారెవరు?**

జ) చాలా మందున్నారు. దిగంబర కవులు మొదలుకొని నార్ల ఏబికె. శ్రీశ్రీ. గురజాడ వంటి వారి ప్రభావం నామీదుండేది. సూర్యాపేట కేంద్రంగా నాస్తిక కేంద్రం నడిపిన ఖానాగారు, చార్వాకాశ్రమ స్థాపకులు రామకృష్ణగారు, మల్లాది వెంకట రామ్మూర్తిగారు మొదలైనవార్తో సంబంధాలు ఉండేవి. సుమారు 10 సంవత్సరాలబాటు మహోదయ అనే కలం పేరుతో రత్నగర్భ, స్టేట్‌టైమ్స్, ఏలూరు టైమ్స్, గాండీవం, తెల్లజెండా, నాస్తికయుగం, చార్వాక, యువజన, వికాసం, ప్రజాధికారం, మూక్నాయక్ మొదలైన పత్రికల్లో రచనలు చేయడమే కాక వాటి ప్రచురణకు సహకరించేవాడ్ని కూడా. 'నవచైతన్య' అనే సాహిత్య సాంస్కృతిక సంఘాన్ని భీమడోలులో స్థాపించి, 10 సంవత్సరాలు ప్రగతిశీల కార్యక్రమాలతో నడిపాను. అలాగే మార్క్స్, శ్రీశ్రీ మొదలైనవారిపై కరపత్రాలు ప్రచురించా. నాగభూషణ్ పట్నాయక్ లాంటి ఉద్దండ విప్లవకారులు సైతం నన్ను పిల్చి చర్చించేవారు.

**ప్ర) మీ ఉద్యోగ సంబంధ విషయాలు చెప్పగలరా?**

జ) కానిస్టేబుల్గా చేస్తూనే హెడ్ కానిస్టేబుల్‌గా ప్రమోటై 7 సంవత్సరాలు



ధ్యాన మందిరం

పనిచేసి ఎస్.ఐ.గా సెలక్టయ్యాను. అంతకుముందే అనేక డిగ్రీలు చేసాను. నీతినిజాయితీగా వుంటూ లంచాలు తీసుకోకపోవడంతో 20 సంవత్సరాలు పన్చేసాకే సి.ఐ.గా మారాను. తర్వాత రిటైరయ్యా.

**ప్ర) బౌద్ధసంఘాలు కూడా ముఠా నిలయాలుగా అగ్రకుల పెద్ద మనుషులతో కూడిన భజన సంఘాలుగా మారాయనే వాదనపై మీ భావం?**

జ) బౌద్ధసంఘాల్లో కులమున్నమాట నిజం. అందుకే ఐక్య ఉద్యమాలు సాధ్యమవడం లేదు. ముఠా రాజకీయాల బెడద కూడా ఇందుక్కారణం.

**ప్ర) మైత్రేయాశ్రమ స్థాపనకు దారితీసిన పరిస్థితులేమిటి?**

జ) ఏలూరులో మొట్టమొదటి హేతువాద మహాసభ నిర్వహించేనాటికే కులనిర్మూలనోద్యమాలతో నాకు గట్టి సంబంధముంది. అంబేద్కర్ను లోతుగా అధ్యయనం చేసి ఈ దేశంలో కులం పోకుండా ఏ ఉద్యమం కూడా విజయవంతం కాదని తెల్సుకుని తద్వారా బౌద్ధ ప్రచారం కోసం 1988లోనే Buddhist Society Prospects అనే సంఘాన్ని స్థాపించి బౌద్ధధమ్మ పరిచయమనే చిన్ని పొత్తాన్ని లక్షల సంఖ్యలో ప్రచురించి పంచాను. కొడవలి బౌద్ధక్షేత్రాన్ని బాగుచేయించాను. అనేక కరపత్రాలు, గ్రంథాలు ముద్రించాను. అవినీతికి సహకరించని ఉద్యోగులకు ఈ దేశంలో



ట్రాన్స్ఫర్లూ, వేదింపులు, బెదిరింపులే బహుమతిగా లభిస్తాయనే నిజం తెల్సిందే కాబట్టి అనేక ఇబ్బందులకు లోనై వివిధ ప్రాంతాల్లో విపశ్యనా ధ్యాన కేంద్రాల్ని స్థాపించే యత్నం చేసి అవి కుదరకపోవడంతో విరమించుకుని ప్రత్యామ్నాయ భావజాల ప్రచారోద్యమాలకో ముఖ్య కేంద్రంగా వేమగిరి వద్ద మొదట ఎకరం స్థలం కొని 1996లో మైత్రేయ బౌద్ధ విహారాన్ని స్థాపించాను. ఉద్యోగంలో సంపాదించిన డబ్బులో దాదాపు అత్యధికశాతం దీనికే వెచ్చిస్తూ అద్భుతమయిన ముగ్ధాశ్రమంగా తీర్చిదిద్దేందుకు శాయశక్తులా ప్రయత్నిస్తున్నా.

**ప్ర బౌద్ధసంఘాల్లో సైతం పురుషాధిక్యతే అమలౌతోందనే విమర్శపై మీరేమంటారు?**

జ) మీరడుగుతుంటే నిజమేననిపిస్తోంది. స్త్రీలు ఎక్కువమంది లేరు. అయితే మొత్తంగా చూసినప్పుడు బౌద్ధుల సంఖ్యే చాలా తక్కువ కాబట్టి స్త్రీల సంఖ్య సహజంగానే తక్కువుండటం ఆశ్చర్యమేమీ కాదు.

**ప్ర) బయట పెద్ద పెద్ద మాటలు చెప్పే బౌద్ధులు వ్యక్తిగత, కుటుంబ విషయాల్లో దిగజారుడుతనాన్ని అవలంభించడమే యిందుక్కారణమంటే ఏమంటారు?**

జ) పురుషాధిక్యతా, అలాగే వ్యక్తిగత స్వార్థాలు ఉన్నమాట నిజమే. అందుకే స్త్రీలూ, యువతా రావట్లేదు. దీనిపై దృష్టిపెట్టాల్సినవసరం వుంది.



సమావేశ నిలయం

**ప్ర) మీ కార్యక్రమాల గురించి చెప్పండి?**

జ) రచనా వ్యాసంగం తగ్గిపోయింది. క్షేత్రస్థాయి కార్యక్రమాలపై దృష్టి పెట్టా. కొన్నాళ్ళు ఉచిత పాఠశాల, వృద్ధాశ్రమం కూడా నడిపాను. ఔషధమొక్కలు పెంచడం మొదలుకుని అన్నార్తులను ఆదుకోడం దాకా ఎన్నో ప్రజాహిత కార్యక్రమాలు చేస్తున్నా. ఇప్పటికి 58 సార్లు రక్తదానం చేసా. బుద్ధుని దివ్యవిగ్రహంతో సహా అశోకుడి వరకూ దార్శనిక మనోహర మూర్తుల్ని ఆశ్రమంలో ప్రతిష్టిస్తున్నా. అలాగే కుదిరితే భవిష్యత్తులో 'శూద్ర' అనే పత్రిక పెట్టాలనుకొంటున్నా.

**ప్ర) బౌద్ధుల్లో విగ్రహారాధనపైగల విమర్శలపై మీ స్పందన?**

జ) విగ్రహారాధనకీ, విగ్రహస్ఫూర్తికి వ్యత్యాసముంది. వ్యక్తుల్ని దైవాలుగా మార్చి మూఢభక్తితో చేసే గుడ్డి విగ్రహారాధనా, వ్యక్తుల ఆలోచనల్ని, ఆచరణనీ ఆదర్శంగా తీసుకుని మన కార్యాచరణను నిర్దేశించే హేతుబద్ధ భావక ఒకటి కావు. అవయవాల పొందికతో కూడిన విగ్రహమూర్తుల్ని పూజించడం కంటే భావాల ఐక్యత కోసం ఓదార్పునిచ్చే ప్రతిమల్ని ప్రజాస్వామిక స్ఫూర్తితో గౌరవించడం తప్పుకాదు. అందుకే అత్యధికశాతం బహుజనుల కోసం పాటుపడిన బుద్ధుడు, అంబేద్కర్ విగ్రహాలు ఆత్మగౌరవ సంకేతాలే గుడ్డిభక్తి చిహ్నాలు కాదంటాన్నేను.



**ప్ర) ఇక చివరిగా బౌద్ధం ఈరోజెందుకవసరమో చెప్పండి?**

జ) అట్టడుగునుంచి వచ్చి బౌద్ధాభిమానులుగా మారిన రేపల్లె సామ్యూల్ జాన్ గారు, తెలంగాణా అంబేద్కర్ భూషి గారు, చిరువెళ్ళ రాఘవరావుగారు, లియాకత్ అలీగారు, శివనాగిరెడ్డిగారు, రఘుపతిరావుగారు, పిల్లి రాంబాబుగారు, ధర్మచక్ర హరిప్రసాద్ బోధిగారు, మహానాగ వామనానంద గారు, రాయదుర్గం విజయలక్ష్మిగారు, చెల్లపల్లి స్వరూపారాణిగారు, కత్తి పద్మారావుగారు, కంచి ఐలయ్యగారు, జనమిత్ర విష్ణుమూర్తిగారు, ఇండియన్ బుద్ధిస్టు బెవర వీరభద్రరావుగారు, రసరేఖ సంపాదకులు ముంగర జాషువాగారు, డాక్టర్ వావిలాల సుబ్బారావుగారు, మల్లేపల్లి లక్ష్మయ్యగారు, రేగుళ్ళ మల్లికార్జునరావుగారు ఇంకా ఎంతోమంది బౌద్ధాభిమానులున్నారు. దీనజనోద్ధారణే ప్రధాన ధ్యేయమైన బౌద్ధం ఈరోజు మరింతవసరం. సత్యం, అహింస, కరుణ, ప్రేమ, ప్రతీత్య సముత్పాదంతో కూడిన స్వేచ్ఛాసమాజ స్థాపనే నా ఆశ్రమ లక్ష్యం. జగన్నాథరావుగారి లాంటి మిత్రుల ప్రోత్సాహంతో ఈ దేశ ప్రజల్లో లోతుగా జీర్ణించుకుని పోయిన సి.సి.సి.పి. (Caste, Creed, Corruption and Politics)ల్ని నాశనం చేసి నాలోని ప్రతి కణం ప్రతిక్షణం మానవతావాదమైన బౌద్ధధమ్మ వ్యాప్తికి వెచ్చించడమే నా జీవిత లక్ష్యం.

(2015లో ప్రచురించిన సద్దమ్మ స్వరాలు, బౌద్ధ ఉద్యమకారుల ఇంటర్వ్యూల పుస్తకంలోనిది)



# మైత్రేయ బౌద్ధ విహార

## ఒక సంక్షిప్త పరిచయం




ప్రచురణ

**అడుగుజాడ**

రాజమహేంద్రవరం

